# పసిడి రథం

## బాలల గేయాలు



ఆవంత్స సోమసుందర్



ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి
హైదరాబాద్

**PASIDI RATHAM**-Baala Geyalu
By : **Avanthsa Somasundar**
Published by: Director & Special Officer, A.P. Baalala Akademi, o/o Jawahar Bal Bhavan, Public Gardens, Hyderabad-500 004.

ప్రచురణ సంఖ్య : 86
మొదటి ముద్రణ : 1992
ప్రతులు : 5000

వెల : రు. **5-00**

ముఖచిత్రం,
బొమ్మలు :కరుణాకర్

టైప్ సెట్టింగ్ :
ప్రసాద్ గ్రాఫిక్స్
3-6-115/5, హైదర్‌గూడ రోడ్డు,
హిమాయత్ నగర్, హైదరాబాద్-500 029.

ముద్రణ :
కళాజ్యోతి ప్రాసెస్ ప్రైవేట్ లిమిటెడ్,
ఆర్.టి.సి. క్రాస్ రోడ్స్, హైదరాబాద్.

ప్రతులకు :
ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి
జవహర్ బాలభవన్
పబ్లిక్‌గార్డెన్స్, హైదరాబాద్-500 004.

# తొలిపలుకు

బాలలకు విద్యావైజ్ఞానిక సాంస్కృతిక రంగాలలో క్రమ వికాసం కలిగించాలనే లక్ష్యంతో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1976లో ఆంధ్ర ప్రదేశ్ బాలల అకాడమిని స్థాపించింది. నాటి రాష్ట్రపతి ఫక్రుద్దీన్ అలీ అహ్మద్ ప్రారంభం చేసిన బాలల అకాడమికి, నాటి విద్యా సాంస్కృతిక వ్యవహారాల శాఖ మంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు తొలి అధ్యక్షులుగా ఉన్నారు. బాలల అకాడమి తన లక్ష్యసాధనకోసం చేపట్టిన పథకాలలో బాల సాహిత్య ప్రచురణ పథకం కింద పిల్లలకు మంచి పుస్తకాలు ప్రచురించే కార్యక్రమం ఒకటి.

జవహర్ బాలభవన్ బాలల్లోని సృజనాత్మక కళలను ప్రోత్సహిస్తుంటే బాలభవన్‌లో మరొక భాగమైన బాలల అకాడమి బాలల విజ్ఞానోదయానికి కృషిచేస్తున్నది. బాలల సమగ్ర అభ్యుదయానికి ఇవిరెండూ రెండుకళ్ళు వంటివి. విజ్ఞానానికీ, వినోదానికీ రెండూ ఒకే వేదికగా విరాజిల్లుతున్నాయి

వివిధ వయోవర్గాల బాలల అవగాహన స్థాయికి తగినట్లు, సరళమైన భాషలో, తేలిక పదాలతో కథలు, గేయాలు, గేయకథలు, బొమ్మల కథలు, జీవితచరిత్రలు, నవలలు, వైజ్ఞానిక రచనలు ప్రచురించటం జరుగుతోంది. రాసిలో కాకుండా వాసిలో శ్రద్ధ వహించి, బాలల్లో విజ్ఞాన వినోద వికాసాలను పెంపొందించి, వారికి ఉత్తమ బాల సాహిత్యం అందించటమే ప్రధాన ధ్యేయంగా పెట్టుకొన్నది బాలల అకాడమి.

అమృత తుల్యమైన బాలసాహిత్య సర్వస్వాన్ని ప్రచురించాలనే సదుద్దేశంతో వెలువరించిన పుస్తకాలలో ఇది ఒకటి.

ఇకపై కూడా బాలలకు ఆసక్తిని కలిగించే పుస్తకాలను ప్రచురించే ప్రయత్నాలు చేస్తున్నాము. ఉత్తమ అభిరుచిగల తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు - మేము చేస్తున్న ఈ కృషిని బాలలకు అందుబాటులోకి తీసుకురావటానికి సర్వవిధాలా మాతో సహకరిస్తారని ఆశిస్తున్నాము.

శారదాఅశోకవర్థన్
సంచాలకులు మరియు ప్రత్యేకాధికారిణి
జవహర్‌బాలభవన్, ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి.

## ఇందులో



# బాలలకు స్వాగతం

ఆటలతో కడు డస్సి నారురా
మొగాలు కడుగుక రారండీ...
ఆకాశంలో వెన్నెల అదిగో
వెండికంచములు సర్దిందీ...

వెచ్చని బువ్వల నారగించి, ఎం
చక్కగ రండీ నాదరికీ-
ఎన్నో కతలూ, ఎన్నో పాటలు
చెబుతా త్వరగా రారండీ...

మంచి సంగతులు వింటేలోకపు
పోకడలన్నీ తెలియునురా...
మంచీ చెడ్డా వెలుగూ యిరులూ
అల్లీ బిల్లిగ కలిసేను...

ఆటలు ఒంటికి పుష్టికూర్చగా
మాటలు మనసును పెంచేను,

మంచి సంగతులు వింటే మనసులు
తీయని కలలను కంటాయి...

తెలివిడి పెరుగక విడదీయగలే
మసలే మనుష్యుల నైజములు-
చక్కని మాటలు కూర్చిన పాటలు
మంచి సంగతులు తెరిచేను!

పూర్వకాలమున విష్ణుశర్మయను
మహానుభావుడు పిల్లలకె
పంచతంత్రములు వ్యోగములపరముగ
మనసుల రంజిల తెలిపాడు!

అట్లే చక్కని పాటలతోనే
మంచి సంగతులు తెలిపెదను-
బ్రతు కతిస్వల్పము - జ్ఞానమనంతము
ఎన్నో తీరుల పొందాలి.....

బ్రతుకు చక్కనిది మల్లె పూవువలె
పరిమళాలె వెదజల్లేను...
మంచి వెలుగు వలె మనసునిండితే
చీకటి చెడుగులు తొలగేను...

నిరాశగుడ్డిది బతుకు చిగురులను
నిర్దయగా నలిపేస్తుంది....
దురాశరక్కసి విషములు విసి మన
మనసున మంటలు రేపేను!

చీకటిలో పడి మసలేవాడికి
ఆశ కిరణమై నడిపేను-
జ్ఞానమె ఆశాకిరణము మనిషికి
తెలియని దారులు తెరిచేను...

పిల్లలు దురాగ్రహాలకు లోనై
చెడుదారులలో పడిపోక-
సమగ్రజీవన సాహసయాత్రగ
బతుకు పొడుగునా గడపాలి....

కులాలు మతాలు ఎచ్చులు తగ్గులు
చెడునమ్మకముల పెంచుకొనీ
తరతరాలుగా పెద్దలందరూ
చిన్ని బుద్ధులను కొలిచారు!

మనుషులందరూ సమానమంటూ
మంచీ చెడుగే తేడాలంటూ-
ఇరుగు పొరుగులను ప్రేమించాలని
అప్పరాయకవి తెలిపాడు!

లోకపు సంపదలందరివీ, మన
కళలూ గానం అందరివీ....
అన్నీ అందరి వగుటకు బ్రతుకున
అందరమూ కృషి సల్పాలి....

బాలసూర్యుడరుదెంచే తూరుపు
లేత కిరణములు అందరివీ....
చల్లని వెన్నెల పంటలనిచ్చే
చందమామ మన అందరిదీ....

మంచి తలపులను పెంచుక బతుకును
సుందర స్వప్నం మలచాలి...
బాలకులంతా కలసిమెలసి, వి
జ్ఞాన వాహినుల నీదాలి...

తామర పూవున ఎన్నో రేకులు
కలసి మెలసి శోభించుకదా!
ఒక్కొటొకటిగా రేకులూడగా
వెర్రిగాలి ఎగరేసేను!

ఎన్నో కతలూ ఎన్నోపాటలు
చెబుతా త్వరగా రారండీ...
ఆటల పాటల డస్సినారు-ఇక
చీకటి ముసిరెను మరలండీ....



# వసంతం

వసంతాన్ని చూడు-అది
అసత్యాలు చెప్పదు...
దానికెన్ని గొంతులో-
కోటి పికము లేమో!
వసంతాన్ని చూడు-అది
అసత్యాలు చెప్పదు!
దాని కెన్ని కన్నులో?
కోటి పూవు లేమో!
వసంతాన్ని చూడు-అది
అసత్యాలు చెప్పదు-
దానికెన్ని చెవులో-ఒక
కోటి చివురు లేమో!
వసంత ఋతు వంటేనే
వత్సరాది జగతికి!
వసంత ఋతువొస్తే
పసందవును చెట్లకి...



# అమ్మ వేళ్ళ ఉంగరాలు

అమ్మా వేళ్ళాకుంగారాలూ
ఎంతో బాగున్నాయ్
రెండు రెండూ ఉంగరాలూ
తీసీనాకియ్యా!

ఉంగరాలూ పెట్టూ కోనీ
పెళ్ళికి వెడతానూ...

గోరింటాకూ పెట్టూకోనీ
పెళ్ళికి వెడతానూ...

పట్టూ చీరా కట్టూకోనీ
పెళ్ళికి వెడతానూ-

పట్టూ రవికా తొడుగూ కోనీ
పెళ్ళికి వెడతానూ....

లడ్డూ మిఠాయి జిలేబీలూ
నాకూ పెడతారూ
ఒడ్డూ పొడుగు చూడకనాకే
గౌరవమిస్తారు...

పసుపుకుంకుమ పారాణీలూ
నాకూ పెడతారూ
తాంబూలాలూ వాయినాలూ
నాకూ ఇస్తారూ....
రెండూ రెండూ ఉంగరాలూ
తీసీ నా కియ్యా-
వేళ్ళకు నేనూ పెట్టూకోని
పెళ్ళికి వెడతానూ.



# పాప పలుకులు

పాప నోటిలో ఎన్నో మాటలు
గలగల లాడాయి...
ఆకాశంలో ఎన్నో చుక్కలు
మిలమిల లాడాయి...
ఏటినీటిలో ఎన్నో చేపలు
తళతళ మన్నాయి

చెట్టు కొమ్మలో ఎన్నో పిట్టలు
కిలకిల మన్నాయి

మల్లె తీగలో ఎన్నో పువ్వులు
గుమగుమ లాడాయి
మంచి హృదయములు మంచి గుణాలకు
జలజల మంటాయి...
మంచి మనసులో మంచి తలంపులు
కలకల మంటాయి...



# వెన్నెల హారతి

పాల వెన్నెల పూల వెన్నెల
పాల కడలికి పట్టి వెన్నెల
తేట వెన్నెల పాట వెన్నెల
పాలమీగడ తొరక వెన్నెల
తరపి వెన్నెల వలపు వెన్నెల
బ్రతుకు పండిన పసిడి వెన్నెల!

నగవు వెన్నెల తొగరు వెన్నెల
చెలిమి వెన్నెల కలిమి వెన్నెల
తెలుపు విరిసిన దిగంతాలకు
మెరుపు తీగల నగల వెన్నెల
కలల మెలకువ కొసలు తాకిన
పులకరింతల ముద్దు వెన్నెల!

పాల వెన్నెల పూల వెన్నెల
పాల కడలికి పట్టి వెన్నెల
తేనె కలిపిన వెన్నవలె, హృద
యాలు చేరే జారి వెన్నెల!




# వడగళ్ళు హరివిల్లు

అమ్మా నాన్నా ఇద్దరె మాకూ
నేనూ చెల్లీ ఇద్దరమే!

"లాలలు పోసీ, బువ్వలు పెట్టీ
జోలలు పాడే అమ్మే మంచీ!"

"బొమ్మలు తెచ్చీ మిఠాయి పెట్టీ
కతలను చెప్పే నాన్నే మంచీ!"

అమ్మా నాన్నా ఇద్దరె మాకూ
నేనూ చెల్లీ ఇద్దరమే!

నేను నవ్వితే వడగళ్ళూ, మరి
చెల్లి నవ్వితే హరివిల్లు..

నేనూ చెల్లీ ఎంతో మంచి
స్కూలుకు పోతూ వస్తాము...!

అమ్మా నాన్నా ఇద్దరె మాకూ
నేనూ చెల్లీ ఇద్దరమే!

ఆటలు ఆడీ పాఠాల్ చదివితె
అమ్మ ఎంతగా మెచ్చేనో...

పేచిపెట్టే, చెల్లిని కొడితే-
నాన్న కోపమున ఉరిమేనో!

అమ్మా నాన్నా ఇద్దరే మాకూ
నేనూ చెల్లీ ఇద్దరమే!



# తరమవే... తరమవే...

తరమవే తరమవే
కాకీ కదలాడనే!

గద్దఒకటి చెట్టుమీద
పొంచి కూరుచున్నదే
గూటిలోన పొదగనున్న
గ్రుడ్ల మేయనున్నదే! - తరమవే, తరమవే...

వాడి గోళ్ళ దెబ్బయినా
ఉక్కుముక్కు పోటయినా
తగిలేనా అంతేలే
అంత పెద్దగద్దయినా! - తరమవే, తరమవే...

పక్షిజాతి కంతటికీ
ద్రోహబుద్ధి గద్ద చూడు
బలహీనుల తిని బలిసే
రక్కసి మూకకు ప్రతినిధి! - తరమవే, తరమవే...

చివురించిన చెట్టు కొమ్మ
ఎర్రడాలు మడతలలో
గుట్టుచప్పుడవని రీతి
కూరుచుంది మాయగద్ద! - తరమవే, తరమవే...

బుల్లిబుల్లి గ్రుడ్లు పెట్టి
ప్రేమారగ పొదివి పెంచి
లోకానికి కాపలాగ
కాకిముక్కు లుంచవే! - తరమవే, తరమవే...



# బాతుల బారు

చీకిరి బాకిరి అరిచేబాతులు
నీటి అలలపై కదిలే బాతులు
నింగి నీలిమకు సంబర మొలికే
తెల్లని రెక్కలు - ఎర్రని ముక్కులు!

బాతుల బారులు గుమి కూడినచో
ఆకసమంతా అరుపుల సవ్వడి!
అడవి కోనలో మనుషుల గుంపులు
భయపడి చేసే కేకలు పెనురొద!

దొరువులె బాతులు మసలే గుడిసెలు
చెరువులె బాతులు తిరిగే అడవులు...
చిరు చిరు చేపల విందుల నొసగే
పంట కాల్వలే బాతుల తల్లులు!

ఎంతో తెల్లని దూదికుప్పలై
నీటిని తేలుచు పోయే బాతులు-
కదలవు మెదలవు బొమ్మ వలెనే
గాలులు సోకని కలువల వలెనే!
పాలరాతితో చెక్కిన బొమ్మలు
యేటినీటిలో కదలని బాతులు-
ప్రాణం లేని బొమ్మల వలెనే
మనసుల మాయల మరగేను!
అల్లరి మూకగ తరుముకుపోతూ
ఒక దాన్నొకటి పొడిచి కేరుతూ
చిందరవందరచేసి చెరువులో
ఎరికలు రాల్చును తుంటరిబాతులు!
తెల్లని బాతుల దారుల బారులు
ఠీవిగ కదలుచుసాగేటప్పుడు
తెల్లని బట్టలు వేసుక పిల్లలు
ఆడుచు పోయే ముచ్చట తోచును!
బాతుల బారులు కువకువ లాడుచు
బాట నిండుగా సాగ హాయిగా-
డ్యూటీ ముగించి ఇళ్ళకు సాగే
నర్సుల బృందము మనసున నిలుచును!
అమాయకత్వము బాతులనైజము,
సమైక్య జీవము బాతుల సఖ్యము,
కులాల మతాల భేదము తెచ్చే
మనుషుల కన్నా బాతులె అధికము!



# పిచుకల చకచకలు

రకరకాల గడ్డి తెచ్చి
పటం వెనుక గూడు కట్టె
వెర్రి పిచుక గంతు లేసెనో....
పటం తీస్తె బతుకు కూలునో!

ఇంటి నిండ చెత్త పోసి!
చీదర కలిగిస్తుందని
పిచుకలపై కోపపడకుమా-
పటం తీసి ముట్టబోకుమా!

పిచుకగూటి రెండు గుడ్లు
గచ్చ కాయలంత మెరయు-
పొదిగి పొదిగి పిల్లల తల్లీ-
ముద్దు లొలుకు పిచుకలరయునో!

చిన్ని గూట చెరో ప్రక్క-
వెచ్చగ పవళింపచేసి-
పిచుక తల్లి జోల పాడునో-
చిరుకతలను చెప్పతుందునో!

పిచపిచమను చిరుసవ్వడి
కలిగిస్తూ చంటి పాప -
లవి రెండూ కలల తేలునో-
రాత్రంతా ఆదమరచునో!

తల్లీ బిడ్డలు హాయిగ
పవళింపగ చిన్నిగూటి
పటం మీద రాత్రంతా
తండ్రి పిచుక కాపులుండునో!

తెల్లవార తండ్రి లేచి
రెక్కల నొకసారి దులిపి
ఆరు బయట కలా ఎగురుతు
ఫలహారం చేసి వచ్చునో!

అపుడు తల్లి పిచిక లేచి
తాను బయలు దేరి వెళ్ళి
పెసర గింజ లేరి తెచ్చునో-
బిడ్డ నోళ్ళ ముద్ద లిచ్చునో!

ప్రేమ మీర తల్లి తండ్రి
తమ సుఖాల మరచి పోయి
సంతానము సాకు తూండగా
చిరు పిచుకలు రెక్కలమరునో!

ఉత్త గుడ్డు నుంచి వచ్చి
కండర మలె ఉండగట్టి
పుట్టినదా పిచిక బిడ్డ-
రెక్కలార్చి చకచక మనునో!

చూసి చూడనట్లు నీవు
పిచికలనే మరచావో-
చక్కనైన పిచుకల జత ఎగిరిపోవురా!
కొత్త నింగి దారులలో చిందులాడురా!



# అక్షరాలు అక్షులే

అక్షరాలు అంటనే
అక్షులు సుమీ మనిషికి...
అక్షరాలు అంటనే
పక్షులు సుమీ మనసుకి...

అక్షరాలు నేర్వకుంటె
అక్షులు కేదీ వెలుతురు
అక్షరాలు నేర్వకుంటె
పక్షులు గా ఎగురుటెట్లు?

మనిషి మనసు కాలోచన
చదువే నేర్పించగలదు;
మనిషికి కర్తవ్య దీక్ష-
చదువే కల్పించగలదు;

మనిషొకడే భావించును
మనిషొకడే సృష్టించును
మనిషొకడే సకల జ్ఞాన
మంజూషలు నింపుకొనును!

కాంతి లేని కారుచీకటులు
అక్షర మెరుగని కుక్షులు,
ఎండ పడని బురద గుంట
చదువు రాని మనిషి గుండె!

అజ్ఞాన తమస్సు చీల్చు
అక్షరమే మహాజ్యోతి...
ఆనందోత్సాహాలకు
అక్షరమే మహాకాంతి...!



# శీతుప్రకృతి

గడగడలాడే శీతాకాలం
గడుసు దయ్యమై దుమికింది;
సూర్యుని భవనం వెలిసిన కిరణం
గజ గజ ఒణుకుతురాలింది;

చెట్ల కొమ్మలకు అంటుకు పోయిన
బంగరు మూటల గిజిగాళ్ళు....
గరిక తలలపై పసిడి తీవలకు
ముత్తెము లెత్తెను సాలీళ్ళు....

ఇంద్రజాలికుని మాయాజాలం
రత్నపేటికను తెరిచింది;
కదిలే జలనిధి నిమిషంలోపల
కదలికలుడిగి నిలిచింది;

తేలే గాలులు ఊగే గుత్తులు
చేతుల కందక పరు వెత్తెన్-

చల్లని కెరటం . కమిచికొసతో
వీపులు బాదుచు కొనసాగెన్!

కొండ కొమ్ముల్లో దుమికేధారకు
గీరా పొగరూ తరిగిందో
కొండ చెరియలో పారేవాగుకు
మృదంగ నాదం కునికిందో!

నేలకు జారిన మంచు టద్దములు
సూర్యుని మొగమే వెలసిందో-
తూరుపు ఊరుపు పొగతెర మరుగుల
పడమటి తలలే తెగి పడెనో?

ఏటి తటమ్ముల నూగే కాడలు
ఊటి పూవులకు హారతులో-
లేతగరిక మొన కొరికే దుమికే
చెవుల పిల్లి ఒక శశిరేఖో!

గడచిన రోజుల నడచిన కతలను
బాటల జాడలు వినిపించున్
చెట్ల తోపులో మెరిసే నవ్వులు
గాలికి తేరులు చేకూర్చున్!



# సంబరాలు పండుగలు

పిల్లలారా రండి
అబ్బాయి అమ్మాయి
అందరూ చేరండి!
మన పల్లె కీనాడు
సంబ్రాలు పండుగలు
ధన ధాన్య సమృద్ధి-
సిరి సంపదల వృద్ధి...

మన పల్లె లోగిళ్ళ
పండుగలు జరపగా-
సంబ్రాలు పంచగా-

సుఖములకు సంతోష
గీతులకు నిలయముగ
కూర్చండి మనపల్లె!

రండిరా దండిగా
నాట్యమాడే వేళ!
భాగ్యదేవతలార-
పరవశించండిరా!
నీ రెండలో గాలి
వెండి తీగల కూర్చె-
పసిడి తీగల నద్దె
పొద్దు పొడుపే వేళ!

వెన్నెలల మెడలలో
పూలు కై సేసింది-
మొదుగల గుండెల్లో
మోదుగలు పండెరా!
అడవి గుబురులు తరులు
క్రొక్కారు పూలతో
మెరిశాయి రారండి!
కురిశాయి ముత్యాలు...
అతిధులెవరైన సరె
ఆహ్వాన మందించి
ఆసనా లివ్వండి-
ఆసనా లివ్వండి!
అర్ధనగ్నత నిన్న
సిగ్గులో ముంచింది-
ఇరుగు పొరుగుల కిపుడు
ఇద్దాము దుస్తులను....
బెంగేల పెద్దోడ
పంట తల్లికి కొరవ
లేదోరి చిన్నోడ!
చిన్నమ్మ నవ్వింది....
తలమందల్లార
అడవిలో దూరాలా
పోకండి! ఈ గరిక
మైదాన మది మీదే!
పోకండి పోకండి
పాల పొదుగుల్లార!
మేమండి, ఆడండి-
గుమ్మటా లూదండి!
పిల్లలారా రండి!
పండుగలు జరపండి...
అమ్మాయి లబ్బాయి
లందరూ హాయిగా...
సంబరాలకు నేల
పసిడి బాలింతరా!
అమ్మలూ నాన్నలూ
అందరూ రండిరా!



# చేరదీసే చలువ వెన్నెల

కష్టకాలము దాపురిస్తే
కన్ను కాచే రెప్ప రీతిగ
కాచు వాడే- బ్రోచువాడే
అచ్చమగు స్నేహితుడు; మిత్రుడు;

కలిమి వుంటే బంధుజనములు-
లేమి కలుగగ ఎవరి కెవరో?
కాని మిత్రుడు ఎల్ల వేళల
చేరదీసే చలువ వెన్నెల....

సొంతలాభము కొరకు ప్రీతిగ
మాటలాడుచు దరికి చేరే-
అదను దొరికిన కాటువేసే
ఖలుల మెరుగులు నమ్మ మోసమె!

చెలిమి నిచ్చిన చెలిమికలుగును
హృదయమిచ్చిన హృదయ మందును
బ్రతుకు రక్షణకవచమే కద
ఇరుల మింటను వెలుగు బింబము...

మేక వన్నెల మెకము రీతిగ
చెంత చెంతల తిరిగి కితవులు,
వెనుక వెనుకనె మ్రింగజూతురు
తెలివి ఒకటే బ్రోచుకవచము...

బంధు వర్గముకన్న మిన్నగ
కలిమి లేములు సరకుసేయక
అంటి పెట్టుక తిరుగు నేస్తమె
కొంగు బంగరు, కోటిలాభము!

చల్ల చల్లని నీడనిచ్చే
వెచ్చ వెచ్చని వెలుగు లిచ్చే
పరమ మిత్రోదయమె భాగ్యము
సర్వదా సహకార భూజము!



# జాబిల్లి

వచ్చాడమ్మా...వచ్చాడమ్మా...
వచ్చాడమ్మా—జాబిల్లి!

పడమటి కొండకు
నిండంటమ్మా-
పార్వతి ముక్కుకు
నత్తంటా....

వచ్చాడమ్మా...వచ్చాడమ్మా
వచ్చాడమ్మా...నెలవంకా!

పడమటి కొండను
ఆడే నటేశు
జిలిబిలి తలలో
మల్లెల చెండై-

వచ్చాడమ్మా...వచ్చాడమ్మా
వచ్చాడమ్మా...నెలవంకా!

తాటోపెట్టే
పండుగ కోసం
వచ్చారంటా పేరంటం

చుక్కల రాణుల పేరంటం

వచ్చాడమ్మా...వచ్చాడమ్మా
వచ్చాడమ్మా—జాబిల్లి!

పాటలు పాడే
ఆటలు ఆడే
సొగసులు చూపే పేరంటం!
చుక్కలరాణుల పేరంటం!

వచ్చారండీ పేరంటం-
టం...టం...టం...టం....!
చుక్కల రాణుల పేరంటం!!

వచ్చాడమ్మా... వచ్చాడమ్మా....
వచ్చాడమ్మా-జాబిల్లి!

నందికేశుని కొమ్ములవాడీ
ఈశునిముమ్మెన వాలుల వేడీ
గంగా భవాని చల్లని తరగల
తేలియాడు శుభరాజ హంసగా

వచ్చాడమ్మా...వచ్చాడమ్మా....
వచ్చాడమ్మా—జాబిల్లి!



# సీతాకోక చిలుకలు

సీతాకోకచిలుకలు చూడు
ఎన్నో రంగుల రెక్కలు చూడు
సూర్యుని తెల్లని కాంతిని మరిగే
నింగి లోతుల నీలాలద్దీ
ఏడూ రంగుల ఇంద్రధనుస్సులో
పొరలీ కరగీ జలకాలాడీ
ఇన్నిరంగులూ తెచ్చుకొన్నవో!

పచ్చనిరంగుల గన్నేరులతో
ఎర్రని రంగుల కరవీరంతో
కనక చేలముల కనకాంబరతో
మెత్తని లాలిమగులాబిపూలతో
ఎన్నో రంగుల పూలచెలిమితో
ఎన్నో రంగుల రెక్కల దాల్చెనో.

కన్నుల కెంతో విందొనరించే
శోభల కూర్చే సీతాచిలుకలు
వాటికి ఆపే రెటుల వచ్చెనో
ఆ కథ వింటే చిత్తముకాదా!

సీతాకోక చిలుకకు పూర్వం
సాదాగా ఒకరంగే కలదట!!
ఆ కథవింటే అబ్బురమే కద!
అడవి దారిలో రామలక్ష్మణులు
అంగరక్షకుల రీతి నడువగా
సీతమ్మకు ముంజేతిని వాలీ
సాను తాపమును వెలిబుచ్చినదట!
అంతట తీయని తల్లి సీత తన
నార చీరతో దానిని కప్పి
రంగుల రెక్కలు దాల్చ మన్నదట!
అంతే ఆయమ చల్లని దీవన
వెను వెంటనె ఫలియించి మించగా
రెక్కల కెన్నో రంగురంగులై
కోటి కోటి హరివిల్లుల షోకై
సీతాకోక చిలుకల పేరున
అందులకే అలనాటి నుంచి మన
నేటికి సీతా కోకచిలుకగా....
ముద్దు ముద్దుగా మనము పిలుస్తా
అడవి లోని సీతమ్మ తలుస్తా
పూలతేనెతో విందుల నిస్తా
అపార గౌరవ మందిస్తాంటాం!
సీతా కోక చిలుకల రంగులు
మనిషి కుంచెతో వేయజాలనివి!
చూచిన కన్నుల కెన్నో వెలుగులు....
ఆవంతయినా విశ్రమించకే
చంచలమై కదలాడును నింగిని!
సీతమ్మనె అవి వెదుకుచుండునో—
మనసున బెంగల మరి మరి కుందునో!
నడయాడే హరివిల్లు సొగసులవి
కొండల దుమికేధారల సొరులు-
సీతాకోక చిలుక కుమారులు!
సీతాకోకా చిలుకల చూడూ-
ఎన్నోరంగుల రెక్కల చూడూ-

అంతే- పట్టిగ అర్రట్లాడకు!
మోటు వ్రేళ్ళతో పట్టుకుంటివో
ముక్కా ముక్కలైరాలును రెక్కలు...
రెక్క లెంతగా నాజుకో-మరి
ముట్టిన వెంటనే పోవును రంగులు!
ఆకసమంటే ఎగిరే రెక్కలు
తరగని బింకం కనులకుచాలదె?
అందా లొలికే రంగులుచాలనె?
ముట్టుకు ముట్టుకు ఆసుకుమారిని
మిన్నుల నెడబాయని చెలికత్తెని!
ఇంద్రధనువులై ఎగిరే చిలుకలు...
పూరంగులై ఎగిరే తరగలు...
సీతాకోకల చిలుకలు చూడు!
ఎన్నో రంగుల రెక్కలు చూడు!
గుండె నిండుగా కొత్త వెలుతురులు
కదలాడే ఒక అద్భుత దృశ్యము....
అదే చాలు పదివేల సంతసము!
పసి మనసులలో ప్రసవ సౌరభము!!